సంపుటము 3] ఆగస్టు 1916 [సంచిక 2

# బాలమిత్ర



## ముగ్గురు స్నేహితులు

ఒకనికి ముగ్గురు స్నేహితులుండిరి. మొదటివాడు ప్రాణ స్నేహితుడు. ఒకనివిడచి యొకడు యొక్క నిమిషమైన నుండజాలరు. శరీరములు వేరైనను మనస్సు లొక్కటి

యైనట్లు వర్తింపుచుందురు. రెండవవాడు మొదటివానికన్న
కొద్దిగా తక్కువ ప్రేమించును. ఐనను అతడే యితడన్నంత
స్నేహము పలుమారు కనబడుచుండును. మూడవవాడు
స్నేహితుడను మాటయేగాని పలుకరించుకొనియైన నెరుగరు.
ఇతని జూచినంతనే మన కథానాయకునికి భయమును
సిగ్గుయు గలుగుచుండెడిది కావున సలాముతప్ప వేరొకమాట
లేదు. తనకు ముఖ్వురు స్నేహితులున్నారని యతడుప్పొంగు
చుండెను. తన ప్రవర్తన పూర్వము భయంకరమైనదై యుండి
నను, క్రైస్తవుడైన పిమ్మట సత్ప్రవర్తనగలవాడై మంచి
పేరు పొందుచుండెను. ఆ దేశప్రభువు న్యాయస్థుడగు వృద్ధ
రాజు. ఆయనకెట్లో యీ మనుష్యుడు చేసిన నరహత్య తెలియ
నాయెను. ఇతని రప్పించి యడుగ నిజము తెలియజెప్పెను
కావున నితనికి మరుచటి మధ్యాహ్నమున యురిశిక్ష విధింప
బడెను. ఈ దుఃఖవార్త చెవిని బడంగనే గుండెలు బ్రద్దలాయె
గాని తన స్నేహితులైనా దన్ను తప్పింతురేమో యను
నమ్మికతో తన ప్రాణమిత్రుని జేరి సంగతి విన్నవింప నత
డెంతయు చింతించి “మిత్రుడా, మరెద్ది జేయుమనిన జేసెద
గాని, యీ రాజునకు నాకు పరమ విరోధముకావున యాతని
కడ కేగజాలను” అనెను. రెండవవాని జేరి తన కథ జెప్ప
నతడు వగచి, భోజనము బలవంతముగ చేయించి, రాజ

నగరము బైలు జేరి గుమ్మమువరకేగుదెంచిన వెనుక "మిత్రుడా అల్లదిగో, రాజమందిరము అక్కడనే రాజుగారుందురు నేనిక యీచోటికి రాజాల భయమువల్ల మోకాళ్లు వణకుచు కొట్టుకొనుచున్న"వనెను. "అయ్యో! దైవమా, ఇతడు కూడ నాతోడ రాలేకపోయెనే యని విచారమొందుచు, మూడవవానియొద్దకు కష్టముతో వెళ్లి బైట లజ్జాభయములతో నిలువబడెను. మూడవ స్నేహితుడు దెసచేరి లోనికి తోడితెచ్చి విచారమునకు కారణమడిగి తెలిసికొని, తానే స్వయముగా రాజుగారి కడకేగి యీ సంగతి సరిచేసెదనని మాటయిచ్చి, ఆ మనుష్యు నచ్చట కూర్చుండబెట్టి, రాజమందిరమున కేగి, రాజుముందర నిలుచుండెను. అమ్మహానాథుని కిరుప్రక్కల నిరువురు భటులు తళతళ మెరయు వాడి ఖడ్గముల దాల్చి నిలుచుండిరి. నరేంద్రుని కరంబున నొక కనకపు బెత్తముండెను. తన్ను జూడవచ్చువారి తట్టా బెత్తమును జూపెనా వారు బ్రతుకుదురు లేదా యఱువది నిమిషములలో వారి శిరంబా కరవాలంబుల వ్రేటుచే దుత్తునియలగు. ఇట్టి ఘోరయాజ్ఞ యున్నను, స్నేహితుని యందలి ప్రీతిచే ప్రాణంబుల నాశింపక యీరాజు చెంతజేరి తన కందింపబడిన బంగరు బెత్తపు కొనను ముట్టి సాష్టాంగ నమస్కారంబు గావించె. నరేంద్రు డతిప్రియంబున నతని

శేవ నెత్తి "మదీయ ప్రియపుత్త్రరాజమా! నీవిందుల కరుగు దెంచుటకు గల కారణంబెద్ది? నీ కోరికయేమి? రాజ్యంబంత నియ్యేమన్నను యిచ్చి పట్టాభిషిక్తుం గావించెదను" యని మక్కువతో తన యక్కున జేర్చి ప్రశ్నింప యా కుమారుం డిట్లనియె.

"నాన్నగారూ! నాదొక్క గొప్ప మనవి. రాజ్యంబనా వసరంబు. మదీయ మిత్త్రుని ప్రాణంబుల నొసంగుమని యడుగ వచ్చితి. ఎట్లయినను దాని తప్పక నొసంగుడు" యని విన్న వింపుచున్న కన్నకొమరుని మాటలకు అలిగి చిన్నవోయిన మోముతో "ప్రియ కుమారశ్రేష్ఠమా! యా పేరు విన్నంతనే హానము చేకూరు. అట్టి దుష్టునకు ప్రాణదానమిచ్చుట యీలోకంబునకు చేటుగాదె! నేను న్యాయపథంబునుండి దొలగజాల. రేపు తప్పక యతనికి యురిచావు గలుగును" అనెను. మహారాజపుత్త్రుని కమితశోకము గలిగి తన ప్రాణము లైనగాని తన స్నేహితుని విడువనని మిగుల పూనికతో వేడ రారాజందులకొడంబడి, తన ప్రియ కుమారుని, తన యేకపుత్త్రుని ప్రాణంబుల న్యాయశాసనము ననుసరించి, తీయించ నాజ్ఞ నొసంగెను. ప్రియులారా చూచితిరా? యా బాలుని ప్రేమ! అతడు నిజస్నేహితుడుగాదె! ఆ స్నేహితు డెవరో యాలోచింపుము. మొదటి యిరువు రెవరో చూతము.

ధనము, బంధుమిత్రాదులు. ధనంబునెంత ప్రేమించినను మన చావువేళ మనతో రానొల్లదుగదా? దానికిని మన రారాజగు పరిశుద్ధ దేవునికి నెంతో దూరము. ధనమును ప్రేమించువారు దేవుని ప్రేమింపజాలరు. రెండవమిత్రుడగు బంధుమిత్రాదుల ప్రేమ, సమాధివరకేగు దెంచువారేగదా? వ్యాధిలో పరామర్శింతురుగాని మనతోగూడ రారాజుకడకేగ వారిచేత గాదు. మరణమును గనుట కెంతయు భయపడుచు రోగములకు దూరముగ నిలుచుందురు. మరి యీ మూడవమిత్రుడెవరు? మన మధ్యవర్తియు, పక్షవాదియు నగు క్రీస్తేసు ప్రభునాథుండు, మనకొఱకు తన తండ్రియగు రారాజు యొద్ద విజ్ఞాపనముచేయుచు, మనకు రావలసిన శిక్ష దాననుభవించి, నరకమను యురినుండి మనల విడిపించినవాడీ మహానీయుడేగదా? ఆయన చెంతజేరుటకేల బిడియము? ఏల సిగ్గు? సరిగా నాయనను ప్రేమించక, లోకమును, పిశాచమును, వృథా డంబములను, ధనమును, బంధుమిత్రాదుల నమితముగా ప్రేమించుట చేతనేగదా? మన నిజస్నేహితుడు యేసు అని గ్రహించి యాయనను ప్రేమించి యాయనను సంతోషపరచ నెల్లప్పుడు ప్రయత్నింతుము గాక.





# మూడు కోరికలు

పూర్వము ఒక సేద్యగానికి ఒక భార్యయుండెను. ఆమెకు ఎప్పుడును తనకులేని కొన్ని వస్తువులు కావలయు నని కోరిక.

సంకురాత్రి పండుగనాడు యీ కాపువాని యింటికి ఒక ముసలిదైన సోదెకత్తెవచ్చి అమ్మా యీరోజు నీకు యేమి కావలయునో మూడువస్తువులు కోరుకొనినపక్షమున అవి నీకు లభించులాగున నేను ప్రయత్నము చేసెదను అని ఆమెతో చెప్పి అక్కడనుండి వెడలిపోయెను.

తరువాత ఆ కాపువాడును ఆయన భార్యయును ఈ మూడు వస్తువుల విషయమై ఆలోచించగా వారి మనస్సులకు గొప్ప వస్తువులేమియు తోచలేదు.

కావున భోజన సమయము కాగానే ఆమె తన భర్తకు అన్నము పెట్టుచు యీరోజు మాకు పప్పుయున్నా వరి

యున్నముణ్ణ్యా తప్ప మరేమియు లేకపోయెను. ఒక పెద్ద గుమ్మడికాయయైనా యుండినయెడల బాగుండుననెను.

వెంటనే ఆ సేద్యగాని విస్తరిమీద ఒక పెద్ద గుమ్మడికాయ ఉండెను. అప్పుడు ఆ కాపువాడు అయ్యో యెంత చెడ్డ కోరిక కోరినావే! యీ పెద్ద గుమ్మడిపండు నీ ముక్కున వ్రేలాడితే బాగుండునని తన భార్యతో ననెను.

తత్క్షణమే ఆ గుమ్మడిపండు ఆమె ముక్కున వ్రేలాడుచుండెను. అంతట ఆ కాపువాడు దానిని దీయుటకు యెంత ప్రయాసపడినను అది రాలేదు.

వారికి ఆ సోదెకత్తె చెప్పినట్లు యింకా ఒక్క కోరిక మాత్రమే యున్నది.

కాబట్టి ఆ కాపువానికి ఆమెయొక్క ముక్కున వ్రేలాడుచుండిన గుమ్మడికాయను తీసివేయుటకంటే వేరొక యుక్తి తోచలేదు.

కావున ఆ కాపువాడు తన భార్య ముక్కుననుండిన గుమ్మడి కాయ వూడిపోవలెనని కోరెను. వెంటనే అది వూడిపడెను. అప్పుడు వారిద్దరు జరిగిన సంగతిని చూచి చాల సంతసించిరి.

కాబట్టి మనకు దేవుడు యిచ్చిన సాధారణమైన వస్తువులను గూర్చి తృప్తినొందవలయునుగాని పేరాశకు పోవలదను నీతి యీకథవల్ల మనకు తెలియుచున్నది.



# ప్రకృతి పాఠములు

## 24-వ పాఠము

## రక్త ప్రసరణము

మొదటిభాగములో చెట్లలోని రస మెట్లు ప్రవహించునో చెప్పియుంటినిగదా. పైకిపోవు నప్పుడొక తరహా గొట్టములగుండను, క్రిందికి దిగునప్పుడు మరియొక తరహా గొట్టములగుండను ప్రవహించును. నీ శరీరమందలి రక్తమును అలాగే ప్రవహించుచున్నది. అది యెల్లప్పుడు కదలుచునే యున్నది. పోవుటకును వచ్చుటకును రెండు వేర్వేరు గొట్టములు శరీరమందున్నవి. వానికి ధమనులు, సిరలు అని పేర్లు. ధమనులు రక్తమును బయటికి గొనిపోవునవి. సిరలు రక్తమును గొనితెచ్చునవి.

రేయుంబగళ్లు విసుకులేకుండా రక్తమును కదలునట్లు చేయు మర యొకటి నీ శరీరములో నున్నది. అది నీ రొమ్ముభాగములో నున్నది. ఆ మర నీ గుండెకాయయే. దీనికే హృదయమనియు పేరు. నీ చెవిని ఎవరి రొమ్ముయొద్దనైనను పెట్టి వినుము. హృదయము రక్తమునెట్లు పంపునో వినగలవు. చాల కష్టపడి పనిచేయునప్పుడు నీ గుండె ధ్వనిని సహితము వినవచ్చును. వడిగా పరుగెత్తుము. అప్పుడుకూడా వినవచ్చును.

నీకు వినబడు ప్రతి దెబ్బకు గుండెలోనుండి రక్తము, పెద్ద ధమనిలోనికి పోవును. ఈ పెద్దగొట్టమునుండి అనేక కాలువలు బయలుదేరి నానాదిక్కులుగా శరీరమంతయు వ్యాపించును. వీటినుంచి యింకా యితర పిల్లకాలువలు బయలుదేరును. చెట్లకొమ్మలవలె యివియు పోను పోను మిక్కిలి సన్నబడును.

ఇట్లు సన్నబడినవి మరీ సన్నగానయి వెండ్రుకలకంటే మరీ సన్నబడును. గనుక వీనికి కేశనాళికలని పేరు. కేశము అనగా వెండ్రుక; నాళిక అనగా గొట్టము; గనుక వెండ్రుకలంత సన్నని గొట్టములని ఈ మాట కర్థము. నిజమునకవి వెండ్రుకలకంటెను సన్ననివి. అవి కంటికి కనుబడనంత సన్ననివి. నీ చేతికి కత్తిదెబ్బ తగిలినయెడల అనేక వందల కేశనాళికలు తెగి వాటినుండి రక్తము కారును. ఎవరికైనను కోపము వచ్చినప్పుడుగాని, సిగ్గు కలిగినప్పుడుగాని ముఖము ఎఱ్ఱబడును చూచినావా? అప్పుడీ సన్నని గొట్టములలోని ఎఱ్ఱనిరక్తము వచ్చినందున ముఖమంతయు ఎఱ్ఱగా కనుబడును. ఈ సన్నని గొట్టములలోని రక్తమే పెదవుల నెఱ్ఱగా జేయును.

గుండెలోని రక్తము ధమనులగుండా పారి శరీరమంతయు వ్యాపించును, మరల అది యంతయు సిరలగుండా పారి

గుండెలోనికి తిరిగివచ్చును. ఈ సిరలలో కొన్ని లోతుగా నున్నవిగాని మరికొన్ని చర్మముక్రిందనే యున్నవి. నీ చేతిని జాగ్రత్తగా పరీక్షించినయెడల నీలిరంగుగా నున్నవి కొన్ని వంకరటింకర గీతలు కనుబడును ఆవే సిరలు అయితే ధమనులు చాల లోతుగానున్నవి. ఎందువలన? ధమని తెగినయెడల రక్తమును ఆపుట కష్టము. సిరలు తెగినయెడల అంత కష్టముకాదు. అది నెమ్మదిగా పారుచుండునుగాని ధమనులలో నది వడిగా పారును. అవి తెగినయెడల హానిగనుక వాటి సంరక్షణార్థము దేవుఁడు వానిని లోతుగా నుంచెను.

ఈ ధమనులు సిరలకంటె బలమైనవి. ఏవైనా మరలు బలముగా పనిజేసినయెడల అవి పగిలి ముక్క చెక్కలై పోవును గాని గుండె ఎంత బలముగ పనిచేసినను ఈ గొట్టములెన్నిటికిని తెగిపోనేరవు. ధమనులలో రక్తము ఎఱ్ఱగా నుండును. గాని ఈ రక్తము హృదయములోకి వచ్చునప్పుడు నల్లబడును.

గుండెలోని రక్తము బయటకు పోవునట్లు గుండెవలననే జరుగునుగాని చెట్లలోని రసమెట్లు ప్రవహించునో తెలియులేదు. అది దేవునికి తెలియును. నీవు మేలుకొన్నను, నిద్రించినను పనిచేసినను చేయకున్నను గుండె కొట్టుకొనుచునే యుండును. ఆలాగు ఎప్పుడు గుండె కొట్టుకొనదో అప్పుడే మర

ణము సంభవించును, ఎంత నిమ్మళముగాను, ఓపికతోను గుండె కొట్టుకొనుచున్నదో చూచితివా? లోకమందు ఓపికతో జరుగుపని మరియొకటి గానరాదు.

---

# బైబిలు పిల్లలు

## యోసేపు

యోసేపు, యాకోబుయొక్క ముద్దుల కొమరుడని వానమంతా ఎరిగిన సంగతియే. చిన్నతనము నుండి, తండ్రి యాతని ఎక్కువగా ప్రేమించి, ఇతర కుమారులకన్న నాతని ముచ్చటగా జూచుచుండెను. బాలమిత్రులారా! మీ పాఠశాలలందు మీ ఉపాధ్యాయులు ఎవరినైనా ఎక్కువ ప్రేమించినట్లు కనుబడితే మీరు అట్లు ప్రేమించబడు వారిపై అసూయ బాల్చుదురుగదా? అట్లులె యోసేపుయొక్క పదిమంది అన్నలు, తమ తండ్రి చిన్నవాడైన యోసేపు బాలుని తమకంటె అధికముగా ప్రేమించినందువల్ల ఆతనిపై అసూయదాల్చి, పగ సాధించుచు సమయము దొరికినపుడు తగిన శాస్తిజేయ కనిపెట్టుకొనియుండిరి. బాలుడగు యోసేపు అన్నలకు ఆహారము కొంచుపోవుచు వారి

యోగక్షేమవార్తను తండ్రికి ఎరింగించువాడు. ఆహా! ఇతరులకు సేవజేయుటకన్న మరియొక మించిన సత్కార్యము



కలదా? అన్నిటిలో ఇతరులకు సేవజేయుట గొప్పది. మన మెంతటి కొలదివారలమైనను మన ఇరుగు పొరుగు వారలకు, అశక్తులకు, బంధు మిత్రాదులకు సేవచేయగలము. ఈ వీలు ప్రభువు మన కందరకు అనుగ్రహించియున్నాడు. గాన సమయము దొరికినపుడెల్ల, తర్వాత చేయవచ్చుననుకొనక, వెంటనే ఇతరులకు సేవచేయుదుముగాక, ఇట్లు ఇతరులకు సహాయము చేయువారి ఫలితము ఎన్నటికి ఊరకపోదు.

ప్రభువు యోసేపు పెద్దవాడైనప్పుడు అతని అధికముగా ఆశీర్వదించెనని మన గ్రంథమున చదువుటలేదా?

ఒక మహానుభావుడు అనుభవ పూర్వకముగా ఇట్లు చెప్పెను. "ఆపదలు గండములు అనునవి ఆశీర్వాదములకు ముందు పంపబడెడి రాయభారులు" ఆహా! ఇదెంత చిత్రము! చిన్నవాడైన యోసేపుపై అన్నలు కక్షదాల్చి, వాని దూర దేశస్థులకు అమ్మివేసినను, ప్రభువు అచ్చట ఆతనికి కలిగిన సకల ఆపదలు తొలగించి, ఘనునిగా చేసెను. దైవము తన బిడ్డలకు ఆపత్కాలసమయమున అనుకూలసాయకుడు. మన ప్రియుల వదలి ఒంటరిగాయున్నను ప్రభువు మనకు సహకారిగాయుండి మనకు వలయు అన్ని అక్కరలు తీర్చు చుండును.

యోసేపు చాల ఘనతనొందిన స్థితియందున్నప్పుడు తనకు అంతకీడు చేసిన అన్నలు ధాన్యమునకై తానున్న స్థలమగు ఐగుప్తునకు వచ్చినప్పుడు, అతడు అన్నల కీడుమరచి వారికి మేలుచేయుటద్వారా కీడును జయించెను. ఇంతటి ఘనకార్యమును మనము చేయగలమా? ఇతరులు మనకు చిన్నకీడు చేసిన, రెట్టింపుకీడు చేయ సమయము చూచుకొను చుండమా? అయ్యో! ఈ పాడుబుద్ధి వదలి మనకు గల కక్షవిడిచి కీడుచేసినవారికి మేలుచేయుచుందుముగాక!

యోసేపు గుణములకు మన రక్షకుడగు యేసుక్రీస్తు స్వామి గుణములకును పోలికలున్నవి. మన రక్షకుని సద్గుణములు మనకును ఉండునట్లు మనము ప్రయత్నముచేసి సంపాదించుకొనవలెను.

యాకోబు తన మరణ పడకపైనున్నప్పుడు యోసేపును, ఆతని ఇరువురు కుమారులను ఆశీర్వదించెను. మనము పెద్దలకు లోబడి వారిని ప్రేమించినవారు మనల దీవింతురు. పెద్దవారి దీవెనలు మనకు అత్యావశ్యకములు. దైవగ్రంథమున "ఆశీర్వాద శాపములు నాలుక వశమునన్నవి" అని చెప్పబడలేదా? పైవాక్యము సామెతలు గ్రంథమునన్నది. ఏ అధ్యాయమున ఏ వచనమున యున్నదో చదువరులగు మీరు కనుగొనుడు. బాలమిత్రులారా! మీరంతా పెద్దలకు చూపవలసిన మర్యాదల చూపుడి. అప్పుడు వారంతా మిమ్మును ప్రేమింతురు.

యోసేపు దైవభక్తిగలవాడు. పరదేశమందున్నను దైవము తన పితరులకు అనుగ్రహించిన కానాను దేశమునకు తన ఎముకలు, తీసికొనివెళ్లి పాతిపెట్టుమని బ్రతిమాలెను. అట్లులే మనమును, మన ఇండియా దేశముపై అభిమానము కలిగి యుండవలెను. తన దేశమును ప్రేమించనివాడు పశుప్రాయుడు. కాన బాలమిత్రులారా! మీరంతా మన దేశ క్షేమమునకై జీవించు ధన్యత ప్రభువు మీ కనుగ్రహించుగాక!

# బాలమిత్ర టపా




ప్రియ బాలమిత్రులారా!

బాలమిత్రటపాకు ఒక ఉత్తరము వ్రాయవలెనని నాకు చాలకాలమునుంచి యభిలాషగలదు; అదియును గాకుండా నా స్నేహితులైన కొందరు క్రిష్టియను పిల్లలు కూడా నన్ను ఒక ఉత్తరము వ్రాయవలసినదని ప్రోత్సాహపరచిరి. అది యిప్పుడు భగవంతుని దయవల్ల నెరవేరినందుకు ఆయనకు యనేకవందనములు. నేను యిప్పుడు సత్యము యొక్క ఫలితమునుగూర్చి కొంత విన్నవించెదను:—

ఒకదినమున యొక పిల్లవాడు గదిలో ఒక కర్రతో యాడుకొనుచుండగా అజాగ్రతవల్ల యా కర్ర గోడకుయున్న యొక గడియారమునకు తగిలి, యది క్రిందబడి తుత్తునియలై పోయెను. తరువాత కొంత సేపటికి వానితండ్రి అక్కడకు వచ్చిచూచి ఆ పనిచేసినది ఎవరని అందరిని యడిగెను. అప్పుడా పిల్లవాడు భయముతో వణకుచు "నేనే అజాగ్రతవల్ల చేసితిని! క్షమించుడీ" యని చెప్పెను. అప్పుడు వానితండ్రి తన కుమారుడు సత్యవంతుడై యున్నందువలన తనకు నష్టము వచ్చినను వానిని ఏమియు యనక సంతోషముచే తన యక్కున జేర్చుకొనెను. వాడు యబద్ధమును చెప్పిన వాని తండ్రికి ఎంత విచారముగానుండును!

ఆలాగే మనముకూడ మన తప్పిదములను మన పరలోకపు తండ్రి యెదుట వొప్పుకొనిన యెడల ఆయన మనలను తన యొద్ద జేర్చుకొనుననుటకు సందేహమేమియులేదు.

అదియునుగాకుండా మనము చేయు ప్రతిపనిలోను మనము ఆయనను మనకు సహాయము చేయుటకు వేడుకొనవలెను.

ఇట్లు మీ ప్రియ బాలమిత్రుడు,
ఈమునిగంటి కోదండరామయ్య,
బెజవాడ.

C. L. S. PRESS, MADRAS—1916